# పీ ఠి క

శ్లో. శ్రీమత్సుధార్ణవే రత్నద్వీపే మాణిక్యమందిరే
రత్నసింహాసనాసీనాం హ్లాదికామేశ్వరీం భజే.

మచ్ఛ్రేయోభిలాషుల కోరికపై నీ బృందావనమను పేరట నా విరచితంబులనుండి కొన్ని గుచ్ఛముల గూర్చియున్నాను. ఇందు "ప్రణయలీల"లో మొదటి పద్యమును తుది ద్విపదలో నొక కొంచెమును మాత్రము "ఉబాయతు" లోని భావము. పత్రికాదుల ననుసరించి వ్రాయబడినవి చాటువులు. అక్కడక్కడ గొన్ని పదములు జనుల వాడుకను బట్టి ప్రయోగింపఁబడినవి.

ఇట్లు
తిరుపతి వేంకటేశ్వర శిష్యపరమాణువు
మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రి

శ్రీ వేంకటేశ్వరాయ నమః

## బ్రహ్మశ్రీ గోవిందరాజు వేంకటసుబ్బారావుగారు

దీర్ఘాయురారోగ్యైశ్వర్యశాంతిపథముల నీ రచయితకును, తత్సంతానమునకును ప్రసాదించుటకునై మత్స్వామి వేంకటేశ్వరుని భాసములకు నిమీలించుచున్నాను.

గోవిందరాజు వేంకటసుబ్బారావు

# అ భి ప్రా య ము లు

శ్రీమత్పరదేవతాయై నమః

కడియము
తూ. గో. జి.
20—11—37

## బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు
### బృం దా వ న ము

అనెడి యీ ఖండకావ్యముల సంపుటము చి॥ మాధవపెద్ది బుచ్చిసుందరరామయ్యచే రచింపఁబడినది. ఇతఁడు సుమారు యిరువదియైదేళ్ళకు పూర్వము నాయొద్ద కొన్నాళ్ళు మాఘకావ్యమును కౌముదియుఁ జదువుకొనుటకు వచ్చినాఁడు. మా దంపతుల యందు కేవలము కన్న తల్లిదండ్రులకన్నను అధిక భక్తిగా నుండి చదువుకొన్నాఁడు. కాని ఆతనికి తోఁచినట్టు చదువుటయే కాని నా యేర్పాటును బట్టి చదువువాఁడు కాఁడు. ఇతని కప్పటికే తెలుఁగులో మంచి కవితాధార యుండెడిది. ఎట్లో కొంత కౌముదియు మాఘములో కొంతవఱకును నెఱవేర్చినాఁడు. ఇతని చదువు గానముతో మిళితముగనే యుండును గాని నాకు రేగుపెట్టవలెనే యితనికి నాదనామక్రియ అనెడి రాగముమీఁద నభిమాన మెక్కువ. ఆ కారణమువలన నాకు శిష్యుఁడై కూడ నా చదువు ధోరణి యితర శిష్యులతో సాటుగా నీతఁ డనుకరించువాఁడు కాఁడు. ఇతని చదువు ఫక్కి మిక్కిలి శ్రావ్యముగా నుండును. కవిత్వము కేవలము

క్రొత్త పోకడలతో నెంతో రుచ్యముగా నుండును. ఒకరి త్రోవకు బొత్తిగా పేఖినిని నడుపనివాఁ డగుటచే నీతని కవితకు గ్రంథ చౌర్యదోషము లేశమును తగులదు. ప్రస్తుత మాంధ్రభాషలోఁ జేరి వాడఁబడుచున్న హూణభాషాపదము లితని కవిత్వములో నెన్నో యుండును. పూర్వకవు లందఱును వారివారి కాలమునకు వాడుకలో నున్న ఆయా యితర భాషాపదములను అంతోయింతో గ్రహించిన వారే. ఈ పుస్తకము విద్యార్థులకు పఠనీయముగా విద్యాశాఖాధి కారులు తప్పక గైకొందురని నా దృఢవిశ్వాసము ఒకరి శిఫా రసుతో దీని కవసర ముండదు ఈ కవిత్వ సారస్య మట్టిది. తన్మ యత్వము సర్వత్ర కవికి స్ఫురించుచుండును. భగవంతుఁ డీతనికిఁ జిరాయురారోగ్యైశ్వర్యముల ననుగ్రహించునట్లు లాశీర్వదించుచు దీనిని ముగింతును.

చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి.
శతావధాని.

శ్రీరస్తు

శ్రీమన్మహా మహోపాధ్యాయ కళాప్రపూర్ణ కవిసార్వభౌమ
ఆంధ్రవ్యాస అభినవ శ్రీనాధాది బిరుదాంకితులగు
బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు

శ్రీ మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రిగారు రచించిన "బృందావన" మను ఖండకావ్యములోఁ గొన్ని పద్యములు కవి గారే శ్రావ్యముగాఁ జదివి వినిపించినారు. నా కా పద్యములు హృద్యములై శ్రవణానందము గలిగించినవి. చక్కని మృదు

పదములతో మధురమధురముగా నా సత్యములు చెవులంబడి యెట్టి వారి మనంబులనైన గఱఁగింపఁగలవని నా సమ్మకము "ఆలోచ నామృత" మను నా సుడి న్విదనాది "ఆపాతమధుర" మను గీతార్థ మను బొందుచున్నవని త్రికరణశుద్ధిగాఁ జెప్పఁగలను. ఇప్పటి వారు వ్రాయు ఖండకావ్యములకన్న వీరి యీ ఖండకావ్యము వేయి తెట్లతిశయించుచున్నదని నా యభిప్రాయము వీరు చిరాయు రారోగ్యములు గలిగి యిట్టి వెన్నో కావ్యములు వ్రాసి లోకము నానందింపఁజేయుదురుగాక యని పరమేశ్వరుని ప్రార్థించుచున్నాను.

రాజమండ్రి
20—11—37

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.

## చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు

శ్రీ వేదమూర్తులైన బ్రహ్మశ్రీ మాధవపెద్ది బుచ్చిసుందర రామశాస్త్రిగారు రచించిన "శారద, సతీస్మృతి" మొదలగు గ్రంథ ములలో పద్యములను మఱికొన్ని చాటు ధారాపద్యములను నేటి యుదయమున వారు చదువగ విని పరమానందము నొందితిని. కవనము ద్రాక్షాపాకమై ధారాశుద్ధిగల్గి ప్రసాదగుణముగల్గి హృద యంగమముగ నున్నది. ప్రతి పద్యము రసాస్పదము ప్రతిభావము గంభీరము. ప్రతి కల్పనము మనోహరము. పరమేశ్వరుడు వీరికి దీర్ఘాయురారోగ్యము లిచ్చి సారస్వతసేవ చేయించుగాక!

రాజమహేంద్రవరము
21—11—37

చిలకమర్తి లక్ష్మీనరసింహము.

శ్రీ పరదేవతాయై నమః

# బృందావనము

## ప్రార్థనము

మ. పరిమాణింప నశక్యమైనది భవత్ప్రాబల్య మీవిశ్వగో
చరమే కాని వమోఘమైనవి భవత్సంకల్పముల్, ప్రేమలోఁ
బరమస్థాన మలంకరించినది నీసత్యస్వరూపంబు, మే
మెఱుఁగంజాలుదుమే ! భవన్మహిమ తండ్రీ, ఆర్తరక్షామణీ !

మ. అరిగో ! అప్పటియాదికాలమున నీవామౌనిరాణ్మండలీ
హృదయాస్థాన మలంకరించి ప్రతితంత్రీసూక్ష్మసూక్ష్మాణువున్
గదలన్ మీటి కొనర్చినాఁడవట వీణాబ్రహ్మగానంబు మా
కెఱియేదీ యొకసారి చూపఁగదె తండ్రీ, దాని మాధుర్యమున్.

శా. ఆ వీణాస్వరమాధురిం చవిలి దివ్యాబ్దంబు లెన్నేని తా
మీవిశ్వంబు సమస్తమున్ మఱచి యందే లీనులైనట్లు మా
కేవేదంబు వచించు నయ్యదియు నీవేకావే, ఏలయ్య మా
కీవా భాగ్యము వారె నీకైనవారే ! మేము కామైతిమే !

మ. తనయుచ్ఛ్వాసమె హంసలాగు హృదయస్థానంబునన్ నిల్పి య
ల్లన జోకొట్టును నిద్రఁబుచ్చునటు లాలాపించు సంగీతని
స్వనమాధుర్యము గ్రోలి కేవలము జీవన్ముక్తుడై పోక యెం
దునకో మానవు డూరకే గడపుచుండున్ గాల మాత్మేశ్వరా !

మ. నరుఁ డొక్కింత మనంబునిల్పి తనకంటన్ బాపకున్ మధ్య ని
వ్వరిముల్లంతటి సూక్ష్మరంధ్రమున నాపోజ్యోతివై యున్న నిన్
బరమాత్మున్ గనలేక శక్తిరజితభ్రాంతి ప్రవిష్టాత్ముఁడై
యురకేగ్రంథముగ్రంథమున్ దిరుగవేయున్ దండ్రివిశ్వేశ్వరా!

మ. నిరహంకారము, నిర్మమత్వమును, తంద్రీ, నిత్యనైమిత్తి కా
చరణస్ఫూర్తియు, శాంతి దాంతియు, యదృచ్ఛాలాభసంతుష్టి, నీ
చరణధ్యాన సమాధు, లన్నవెశదా ! 'సత్యం శివం సుందరం
పరమం' బైన భవత్పదంబునకు సోపానంబు లాత్మేశ్వరా।

తమయందుండినయట్టి యష్టదళపద్మం బష్టభార్యాసమూ
హముగా నిన్ బరమాత్ముఁ గృష్ణునిగ దేహద్వారకన్ నారదా
ది మహర్షుల్ మును నిర్వికల్పకసమాధిన్ గేళిగావించి ని
త్యమునుం జెందరె యద్వితీయమగు నాత్మానంద మాత్మేశ్వరా!

మ. నిరతంబున్ దనలోపలం గల త్రివేణీ సంగమంబందునం
బరమస్నాన మొనర్చి భక్తి మదిరాపానంబు గావించి యాం
తరహంసాత్మకమైన నీప్రణవనాద బ్రహ్మముం జెంది, మా
యురె, మానారదుఁడెంతముగ్ధుఁడయినాఁడో నాఁడు విశ్వేశ్వరా!

మ. కలకాలంబును కాపురంబునకు సౌఖ్యస్వర్గ మాహా! మ
స్ఖలితానందరసంబు, బ్రమ్మఁ జిదాకాశం బధిష్ఠింపఁ గుం
డలినీచక్రసువర్ణపుష్పకవిమానం బెంత ధన్యాత్ములో।
అలయింద్రాదిసురల్ మహామహులు నీయాత్మీయు లాత్మేశ్వరా।

తే. గీ. వచ్చి యొకసారి నా ప్రాణవాయువునను
హృదయవేణువు నూదిపోయెదవె కృష్ణ !
ఆత్మబృందావనంబు నీయాగమమున
కెదురెదురు చూచుచున్నదోయీ, మహాత్మ !

తే. గీ. యమునయే గాక దేహప్రయాగయందు
గంగయు సరస్వతియుఁ గూడఁ గలవుగాన
నా త్రివేణీ జలక్రీడ నాచరింతె ?
నాడికారూప గోపీజనంబు గూడి.

తే. గీ. బాలకృష్ణుఁడవై నాదు ప్రకృతి శ్రుతిని
వేణుగానంబు నేకీభవింపఁజేయు
మనుసరించు మృదంగ మన్నటు త్రివేణి
ఘుమఘుమార్భటి శబ్దంబు గొలుపుచునుచు.



'శారద' నుండి

## శారద వనవిహారము

అతిమొక పూలతోఁటఁ గసపుడుఁ బరుణోదయమల్లమల్లెపూఁ
పొదకడఁ బైడిబొమ్మ్రటము పోల్కి నిలంబడి యల్లనల్లనన్
గదలుచుఁ బువ్వు పువ్వు రవగాలిగి మోహనన్నృత్యమాడు నా
ప్పిదమును గాంచు కన్నెదెస వేయుచ మించుకసేపు చూపులన్.

చ. ఒరయుచుఁ బూలయందము నొయ్యారముగా నళిచందమామతో
దొంరెడు నెన్నొసంటఁబడు తుమ్మెదతెక్కలనంటి రేఁచముం
గురుతెగనెత్తికొంచుఁ గొనగోళ్ళల ముద్దులు మూటగట్టు న
చ్చిలుతుకపేరుదాల్చి విలసిల్లును శారదయన్ సువర్ణముల్.

చ. మడచిన పుస్తకంబువలె మాపుల సెజ్జపయిన్ బరుండి క
న్మూడుచు నలంగెనో నపయునో జడపూవులటంచు వాడుచూ
పెడు పువు కంటఁబడ్డఁ గడుబెగ్గలి బిక్కమొగంబు పైచు నె
ల్లెడఁగనునా మెపూవుచేరి యెత్తుగఁ బ్రాణము చొక్కయెత్తుగన్.

చ. ఆఅవిరిమోజు, విచ్చిసొగసౌ సునుతెక్కలతోడ నూగు క్రొ
వ్విరి నతితృష్ణ, దాస ప్రభవించి గుబుర్కొను తావితీవిపై
మటలు గదించి లోకము సమస్తము పుష్పమయంబయైన సుం
దరమయియొంతియొప్పనొగదా, యనియామెచెలంచు మాటికిన్.

చ. విరిసిన పువ్వుపువ్వునను వెల్గుచు మానసమున్ గరంచు నీ
శ్వరకళ నుప్పతిల్లెడు ప్రసన్నతకెంతయు మోహముగ్ధమై
మఱిమఱిఁ జూచిచూచి కనుమ్రాన్పడియొక్కొకవేళఁ దన్నుఁదా
మఱచుచు మారుపల్కు దొకమాత్రముగా నెలుగెత్తి పిల్చినన్.

చ. అదిగో! లతావితానముల కావలఁ గమ్మని పూఁతపిందెలన్
విదిరెగి మావిశ్రీకి గమనింపుచు నొక్క లతాంగి రావె శా
రద యని పిల్చినంత మసరాజనిభానన వచ్చుచుంటి నే
నిదెయని సాగెడున్ మనము నేఁగుద మయ్యెడకున్ మనోగతిన్.

చ. అలఁతిగ వంచి లేఁతనడుమంటియు నంటనికీతిఁ గోమలాం
ఘ్రుల నిలమోపుచున్ నడచు క్రొత్త యొయారముతోడ బూవుకీ
వల ఫలవృక్షవాటికలపైనఁ గటాక్షసుధాతుషారమున్
జిలికెడు కన్నెచిన్నె దరిసించినఁ గన్నులపండు వయ్యెడిన్.

మ. అలసాలోలసమీరలాలనల విప్పారంగనున్నట్టి మొ
గ్గలకుం దీయని తేనెబుగ్గలకు భృంగశ్రేణు లుత్కంఠతోఁ
గాఁవుల్ దీర్చు లతాగృహంబునఁ జతుష్కోణాకృతిన్ వన్నెవ
న్నెలరాల్ మల్చి యమర్చినట్టి యొక తిన్నెన్ వార లాసీనలై.

చ. సురభిళమందమారుతకిశోరపరీత వనీలతాగృహాం
తర నవపల్లవస్థగిత ధాళధళీకశిలావితర్దికా
పరిసరనిస్వనత్ప్రమదబంధురకోకిలకీతశారికా
స్వర మధురామృత శ్రవణపారణసౌఖ్యరసైకలోలలై.

చ. పొడమెడుమొల్కలంగుటిఁ చిపూచెడు వృక్షములన్ గుఱించి ప్రా
కెడు పలుతీవక్రొన్ననలఁ గెంజివురాకులగూర్చి ముచ్చటల్
నడిపినమీఁదఁ గన్నెవదనంబునఁ జూడ్కి నిగుడ్చి యేదియో
నుడువగనుండె వింద మలనూత్న వధూమణి వాక్యధోరణిన్.

చ. సిరిగలయింటఁబుట్టి యొక చిన్నము గష్టమనంగ నెట్టిదో
యెఱుఁగనిరీతి వర్ధిలు నదృష్టముఁ గూర్చుటెగాక దివ్యసుం
దరతరమైన యీ యుపవనంబును గూడ ననుగ్రహించె నీ
శ్వశురుడు, సహోదరీ, పొగడశక్యమె, వాని చయా ప్రపూర్ణతన్.

తే. గీ. సంస్కృతాంధ్రంబులను పరిశ్రమ మొకింత
సలిపియుంటివి గద ముఖస్థంబు లగునె
దైవపరమైనయట్టి పద్యము లవేని
చదివెదే శారదా ! రాగసరణి ననఁగ.

తే. గీ. చిఱునగవు వెన్నెలను మోవి చివుప సుంత
మిలమిల యనంగఁ గంఠంబు మేళవించి
ప్రకృతి యను శ్రుతి సంసిద్ధపడెఁ బఠింపఁ
గిమ్మనకయుండి మన మాలకింపవలయు.

శా. భక్తత్రాణపరాయణాయ భవతాపఘ్నాయ వేదత్రయీ
ముక్తాహార విభూషితాయ కరుణాపూర్ణ స్వరూపాయ దు
ర్వ్యక్తిచ్ఛేదక తారకప్రణవ పీఠారూఢతాభోగ సం
యుక్తాధ్యాత్మిక రాజ్యపాలన మహోద్యోగాయ తుభ్యం నమః.

మ. పరిశుద్ధంబయి యద్వితీయమయి సర్వవ్యాప్తమై నిత్యమై
నిరవద్యంబయి నిర్వికారమయి మౌనివ్రాతచేత స్సరో
వరహంసంబయి కోటికోట్యరుణభాస్వద్దీప్తిధారావళీ
పరిపూర్ణంబు మహామహంబగు పరబ్రహ్మంబు మమ్మేలుతన్.

మ. యదుసింహంబు యశోదపట్టి నవనీతాహారి కంసారి కెం
బెదవిన్ బిల్లనగ్రోవిఁ జేర్చి తులసీబృందావనక్షోణిలో
మృదుగీతామృత వర్షముం గురియు నా శ్రీకృష్ణమేఘంబు నా
హృదయాకాశముగ్రమ్మి శోక బహుళగ్రీష్మాతపం దార్చుతన్.

మ. కరుణాబ్ధీ! హృదయాబ్జపీఠమున నీకల్యాణరూపంబు ను
స్థిరముంజేసి తరింపగా నొక శుభాశీర్వాద మాసించి నీ
చరణప్రాంతమునన్ శిరంబునిచి తృష్ణా వ్యాకులత్వంబులన్
బరిఘోషించెద నెట్లు తప్పుకొనిపోవన్ నేర్తువో చూచెదన్.

మ. శ్రమలెన్నో విఫలంబులై చనియెనో స్వామీ! మదీయ ప్రయ
త్నములెల్లన్ ఫలియింపలేదు, జగదంతర్యామి! యీయొక్క జ
న్మమునం దీనరమాత్రజీవనములోనన్ మాటికిన్ సంభ్రమ
భ్రమలం గొల్పెడు నీరహస్స్పృహల పూర్ణత్వంబు సిద్ధించునే!

మ. నిరతంబున్ జిరనూతనుండవయి తండ్రీ! నీయెడన్ భక్తిబం
ధురులౌవారిహృదంతరాళములయందున్ నూత్ననూత్నంబుగాఁ
బరగన్ జేసి స్వయంప్రకాశత లయింపన్ జేసి యవ్వారలన్
మరలన్ సృష్టియొనర్పవే! తిరిగి సంహారంబు గావింపఁగన్.

తెలుపన్ నేర్తునె యొక్క జీవనమునందే నన్ను నీ వెన్నిమా
ఱులు సృష్టించి లయింపఁ జేసితివొ కారుణ్యాంబుధీ! యింకఁ గా
వలెనన్నన్ మఱియున్ మఱిన్ మఱి లయింపఁజేసి సృష్టించి కే
వలమున్ నీకనుసన్నలను మెలఁగుతేవన్ దిద్దుకొమ్మా ప్రభూ।

మ. సిరులన్ లేములు కష్టముల్ సుఖములున్ చింతల్ మహో
త్సాహముల్
మరణంబుల్ జననంబులన్నియును యుష్మన్మంగళోద్దేశమున్
నెఱవేర్పందగు సాధనంబులని మౌనీంద్రోలి భావించు నే
పురుషుండాతఁడెబంధముక్తుఁడు స్వయంప్రభూ! నిర్వికారప్రభూ!

మ. పరిపాలించుచునుందు వెల్లపుడు యావద్విశ్వమీవిచ్చు ను
త్తరు వవ్యాహతరీతిఁ జెల్లెడి మహాత్మా ! నీ శుభోద్దేశ మె
త్తెఱఁగో మేముగ్రహింపఁజాలక మహార్తిన్ గ్రుంగుచున్నాము త
త్పరమార్థగ్రహణైకపాటవము మత్స్వామీ ! కటాక్షింపుమీ !

సీ. పసిపాపయగు వాని పాలబుగ్గలపైని
నివ్వటిల్లెడు మొల్కనవ్వుకన్న
అరుణోదయమున విప్పారి తుమ్మెద కాలు
మోపకుండిన తమ్మిపూవుకన్న
ఉరుధాటి నేతెంచు నోరుగాలికినేని
కలఁగని మణిదీపకలికకన్న
ఆతైన సుంత యల్లాడకుండు నిశీథ
సమయమందలి సరోజలముకన్న

తే. గీ. నిర్మలముఁ గోమలంబును నిశ్చలంబు
శాంతిమయమైన యట్టి సుస్వాంతపీఠి
నమరు నీకుఁ బ్రణామ మియ్యరె యమేయ!
అద్వయ! అనంత! ఆదిమధ్యాంతరహిత!

తే. గీ. ఇపుడు మనమున్న యీ లతాగృహ సమీప
కదళికలమధ్యనున్న దల్లదిగో! చూడు,
పెల్లనై పుణితో వింత చెలువుతోడ
నక్షిసాఫల్యమిడుజాడ నలదుమేడ.

తే. గీ. ప్రాచ్యపాశ్చాత్యరచనల బహుళవర్ణ
సంకలన సామరస్య పవిత్ర మనోజ్ఞ
కాంతిపూరంబుతోడ నాకాశవీథి
కెటుల నెదురెక్కుడినా కంటివే! గృహంబు

తే. గీ తాదృశంబగు దివ్యసౌధంబునందు
ననుగుఁ బ్రేయసితో జీవయాత్ర నడపు
హాయిగా నొక్కరసభోగి యుగ్రవర్ణ
నందనోద్యానభాగ మందారశాఖి.

తే గీ. పటులకన నొక దివ్యమందిరముగాని
యాతనికి భూతలస్వర్గ మాగృహంబు
మదిగఱంచెడు ప్రియసతీ మధుర మధుర
సరససల్లాప బహుళ ప్రసక్తి కతన.

తే. గీ. వయసు నలువది కొాక వాసి, వాసి నేటి
తెలుఁగునాటికిఁ దళుకు ముత్తెంపుఁబేరు,
పేరు రఘునాధశాస్త్రి, తత్ప్రియ తనూజ
లిచటి చిన్నారి పొన్నారి యిగురుబోండ్లు.

చ లలితసరోజరాజిసమలంకృతగాంగఝరీదరీపరీ
మళలహరీధురీణ పవమాన కిశోర వికీర్యమాణ త
జ్జలకణరేఖికాగ్రహణ సౌఖ్యరసాస్పద వాక్యచాతురీ
విలసితుఁడంచుఁ బండితులు వేయివిధంబుల మెత్తు రాతనిన్.

మ. అతిగంభీరమనస్వి, దేశహితచర్యాభ్యాసి, హూణాంధ్ర సం
స్కృతిసారజ్ఞుఁడు, నవ్యభారతవిపంచీ లోకకల్యాణభా
షితతంత్రీ పరిముక్తసార్వజనికస్వేచ్ఛారవామోది, త
త్ప్రతి సంపన్నగృహస్థు తత్ప్రతి స్వతంత్రవ్యక్తి లేఁడెందులన్.

సీ. సతికి నాతనిపజ్జ జాజిపూవులసెజ్జ
అతిథి కాతని దృష్టి యమృతవృష్టి
సభకు నాతఁ డొనర్చు చర్చ చందనచర్చ
శ్రోత కాతనిమాట సూటిబాట
నిఱుపేదపాలి పెన్నిధి వాని సన్నిధి
వాసికిం దీవి యవ్వాని యీవి
అనుయాయులకు వానియండ బంగరుకొండ
కలబంధులకు వాని కలిమి బలిమి

తే. గీ. నిరుపమ స్నేహవాత్సల్య నిశ్చలత్వ
జీవకారుణ్య లావణ్య చిహ్నములకు
నతని వదనంబు సదనంబు సతత మతని
పూర్వభవసంచితాగణ్య పుణ్యమేమొ !



*

'శారద' నుండి

## శారదా కృష్ణుల అనురాగము

సీ. పవలను మేడ రెండవ మెట్టునను నిల్చి
లక్షించు నా తపలక్ష్మి యనఁగ
చరియలోపలినుండి తెరలించుకొని పైకి
పొరలెడు సెలయేటి పొంగనంగ
అతిశాంతమైన జీవితమునం దేలిపో
వని యొకానొక సుఖస్వప్న మనఁగ
అరయుచున్న కొలంది నతిశయిల్లునె కాని
కడయేర్పడని మహాకాంక్ష యనఁగ

తే. గీ. కనులు మిఱుమిట్లు గొలుపుచు కడుఁ బ్రసన్న
మగుచు 'మననీయమును' మనోహరమునైన
తన సతీ యౌవనపుఁ దళత్తళ నతండు
కనుచుఁ గనుచునె మోహముగ్ధత వహించు.

సీ. కడుఁ జిన్ని పుష్యరాగపుఁ గట్టడపు దిద్దు
లన్ వ్రేలు రవల లోలకులతోడ
నెమలి పింఛంబు వన్నియ పచ్చ పొదిగిన
కడవ్రేల ముద్దుటుంగరముతోడ

ఎదనెదఁ గెంపు లెల్లెద నింద్రనీలంపు
మణు లమర్చిన కంఠసూలతోడ
చిఱుతగజ్జెల మ్రోతఁ జెవికిఁ బందు వొనర్చు
మేలిబంగటు మొలనూలితోడ

తే. గీ, జాజిపూఁదీగె గాజుల జతలతోడ
రకరకపుఁ జీనిచీనాంబరములతోడ
ముగ్ధమోహన లావణ్యమూర్తితోడఁ
దేజరిలు వాని సతి రతిదేవి జాడ.

తే. గీ. కలకలన్ నవ్వునటు లుండు కన్నులెత్తి
నిష్కలుషితాంతరంగంబు నీడఁజూపు
చూపను పవిత్ర శీతలజ్యోతిఁ బఱపి
పాతకిని సైత మామె 'పునీతుఁ' జేయు

తే. గీ. పలుకు పలుకునఁ బూఁదేనె చిలుకు మోవిఁ
బలువరుస ముత్తెముల కాంతిఁ బదిలపఱచి
తన ప్రియుఁడు గన్నులం గప్పికొనఁగ నామె
ముచ్చటలనాడు ముద్దులుమూటగట్ట.

తే. గీ. అడుగిడినయప్పు డెల్ల జవ్వాడుచుండఁ
కిటికిట నడంగి యడగని పేదనడుము
విభునికడ కామె యరుదెంచి వెడలు హొయలు
కనుటెపో కంటిలోఁ బాపగల ఫలమ్ము.

తే. గీ. కాదమరాయంచనడలోని కులుకు, కన్నె
తరి నడలోని బెందు నిబ్బరపు టొఱపు,
గున్న నడలోని ఠీవి, యప్పువ్వుఁబోఁడి
కదలినపుడెల్ల మనకు సాక్షాత్కరించు.

తే. గీ. సజలజలధరకోమల శ్యామసుంద
రంబులై మోముపై వ్రాలి రవ్వగాలిఁ
జెదరు చిన్నారి నొక్కుల చిన్ని కురుల
దిద్దునపు డామె యెంతయు ముద్దుగురియు.

తే. గీ. పొన్నపువన్నె తేఁయెండపొడఁ గపోల
దర్పణ స్వేదబిందు ముక్తాఫలంబు
లొప్పులొలుకంగ నామె యొక్కొక్కవేళ
నుపవనీసేవ సల్పు నేత్రోత్సవముగ.

సీ. జలకమాడిన పెన్నెఱులమీఁది తడియొత్తి
జడయల్లి కూరక జాఱవిడిచి
నిలువుపాపట నిల్పి నెలవంక యిరువంక
నఱవిచ్చు పుష్పమంజరు లమర్చి
జలతారుపూలతీఁవల జిల్గు పనిసేత
గల యాకుపచ్చని గౌను దొడిగి
కుబుసంబువలె ముద్దుగొలుపు సన్నని యున్ని
వలువ నీటుగా వలెవాటు వేసి

తే. గీ. చిన్ని నడుమున కటునిటు చివురుచేతు
లలఁతి యువ్వెత్తు విలువంపుగలుగ హోపి
వరివడిగ నామె యొక్కొక్క యెడను వచ్చి
పలుకరించును పతిమేను పులకరింప,

సీ. కురులను దూమెఱుంగుగ దువ్వి జడయల్లి
కొనలయందున ఊలుకుచ్చుగూర్చి
బొమలమధ్యను చుక్కబొట్టు నీటుగ దిద్ది
చిటిపొటినగల నన్నిటి ధరించి
లేయెఱ్ఱదాలుఁగల్గిన చిన్నిచిన్ని జ
ల్తారుమొగ్గల నీలిచీరగట్టి
అడుగులవెన్క జీరాడి యాడనియట్లు
పసుపుపచ్చని మేలిముసుగువెట్టి

తే. గీ. ఎదుటికింబోయి విభుఁడు ప్రేమైకదృష్టి
నొరసి తను జూచునపుడెల్ల నొదిగి యొదిగి
యప్పుడపు డామె ముచ్చటలాడఁ దొడఁగుఁ
జిన్నెచిన్నెల చిన్నారి చిలుకలాగు.

సీ. ఒక్కొకప్పుడు వ్రేలియుంగరంబున నున్న
పచ్చచాయకు దృష్టి బఱపుకొనుచు
మఱియొకప్పుడు కంఠమాలలోపలనున్న
నీలాలకెంపుల నిమురుకొనుచు

వేఱొకప్పుడు గులాబీపూవు మోవిపై
చిఱునవ్వు తొలుకాడఁ జేసికొనుచు
ఇంకొకప్పుడు ప్రక్క కించుకించుకగ జా
ఱెడు పయ్యెదను సవరించుకొనుచు

తే. గీ. అపుడపుడు పుష్పవన విహారపు శ్రమంపుఁ
జెమట మొగ్గలఁ గొనగోర జిదిమికొనుచు
సారె కొకతీరు మధుర శృంగారలీల
నెంతయు గలంచుఁ దన జీవితేశు మనసు.

తే. గీ. తెలుగుఁ బయ్యెదచెఱఁగు కెంజేతి చివురు
వ్రేళ్ల విలాసముగ మెలివేసికొనుచుఁ
జిఱునగవుతోడఁ లలిమోము తెఱఁగు గనుచు
నొక్కొకపు డామె నర్మగర్వోక్తులాడు.

తే. గీ. చలువపావడ దాల్చి, యూసరిగపూల
రైక ధరియింపుమని యందురా ? యటంచు
నడిగి, పలిమోవి గదలించునంత కామె
దవ్వనకు నేగి ముసిముసి నవ్వునవ్వు.

తే. గీ. తీసి నగలెల్ల మెయిచాయ తెల్లపట్టు
చీరకున్ మేల్మిబంగారుసీరువోయ
విభునితో నామె యుపవనీ వీధులందు
దిరుగు నొయ్యారమును జూచితీరవలయు.

తే. గీ. పొడుపు కొండను బతి నిల్ప బొంత నిల్చి
కురులతో నింద్రనీలాల గొడుగుపట్టి
మధురమధురంపు టూర్పుచామరము వీచి
నవ్యలావణ్య నీరాజనం బొనర్చె.

తే. గీ. చెంతఁ బొంచున్న పతిరూపు చేతనున్న
గిలుకుటద్దంబునం దిలకించి యామె
చిఱునగవుతోడి నునుసిగ్గుచేత గునియు
నా మనోహరదృశ్య మెంతైనఁ జేయు.

తే. గీ. మొలక నవ్వు మోవి నాట్యంబు సలుపునపుడు
చిదుమఁ బాగ్గాయి ప్రియురాలి చెక్కులందుఁ
బొడము చిఱుగుంటలను ప్రేళ్ళమొనల నొక్కి
యూపు నాతఁడు శృంగార ముట్టిపడఁగ.

తే. గీ. తన యలఁతి యూర్పు పుటు మోముదమ్మి గ్రమ్మి
వలపు లూరింపగా సమీపమున నిల్చి
చివురుఁ గెంగేలఁబట్టి గోక్షీరపాత్ర
పెదవి కందిచ్చుఁ బతికిఁ బ్రత్యుదయ మామె.

తే గీ. నిలువుటద్దంబులోఁ దననీడఁ జూడఁ
జిత్తమేలేనియటులుండి, జీవితేశు
నెనరు గన్నీటిలోఁ దననీడఁ జూచు
నొదలు స్వరంబు గన్నులై యున్నయటు.

సీ. కలకలన్ నవ్వు కన్నులు కన్నులంబెట్టి
లీల బాహులఁ గంఠమాలఁ జేయు
మిలమిలన్ మెఱయు చెక్కిలి చెక్కిలికిఁ జేర్చి
పట్టి చేతిని మెదచుట్టుఁ జాచు
గలగలన్ మెఱయు తళ్కుల బెళ్కులం దాల్చి
కొసరి మాటికి గుజగుజలువోవు
జిలజిలన్ దేనె చిప్పిలు మోవి మోవిపై
నిలిపి నిల్వన మోహనిద్రఁ బుచ్చు

తే. గీ. పొడిపొడిగ రాలిపోవు మైపూఁతతోడ
వడివడిగఁ బర్వు నిట్టూర్పు వలపుతోడఁ
జిఱుచెమరుతోడఁ బతిపేన శిరము వ్రాల్చి
నెనరు గన్నీరు చలువ పన్నీడు రాల్చు.

తే. గీ. పాలనీటి గులాబి లేఁబైరగాలి
నించుక చలించునట్లు చిట్లించు మోము,
శితకటాక్షంబులన్ విరజిమ్మ యామె
పౌల యలుకనేని పతిని సమ్మోహపఱచు.

సీ. అలిగెడువేళ కాలాహియావల ధగ
ద్ధగఁ బ్రజ్వలించు రత్నంబు లగుచు
కనలెడివేళ మేఘచ్ఛన్నమై నీట
బింబించు సాంధ్యరాగంబు లగుచు

నవ్వెడివేళ నానందలీలాతరం
గాపూర్ణమగు రాజహంస లగుచు
శ్రమఁజెందువేళ సుశ్యామలాభ్రముల మ
ధ్యగఁ దేలిపోయెడు తార లగుచు

తే. గీ. సరసమాడెడు నెడ నీలజలతరంగ
సంచలచ్చంద్రికాంచ లాంచలము లగుచు
మాటి కొక సూటి నామె దృఙ్మండలముల
వెడలి జ్యోతిఃప్రభలు వెల్లివిరియుచుండు.

సీ. పండిన కమ్మ సంపంగి రేకులవంటి
మృదులాంగుళులు సారె గదలుచుండ
పాలఁజక్కెరవోతెఁ బంచమశ్రుతిలీన
మగు కంఠ మమిత రుచ్యంబుగాఁగ
కృతులయం దొదుగు సంగతులు తీగలసుంది
జలజలరాలు పుష్పములఁబోల
శృంగారవనచైత్ర శేషానిలములట్లు
వలపించు మధుర భావములు వొదల

తే. గీ. కిన్నెరను మీటి వివిధ భంగికల నామె
గురియు గానామృతంబును గ్రోలి గ్రోలి
యెంతకేనియు నాతఁ డొక్కింతయైనఁ
దనివిజెందఁడు తృషితచాతకమురీతి.

చ. చిగిరిచిచున్నదేదో వికసించినదేదో యెఱుఁగరాక జం
టగఁ బెనవైచి తేఁజివురుడాలును పుష్పవికాస మేకహే
ళిగ నొకదానిపైఁ బ్రతిఫలింపఁగఁజేయుచు నొక్కఁ డెంతొ ము
ద్దగు నునుదీపలట్టు లలరారుచు నుండిరి వారలాల్మగల్.

సీ. జీవితోద్యాన సంస్థిత దృఢస్నేహంపుఁ
దీప పూచినయట్టి పూవు లనఁగ
దాంపత్య సుఖసముద్రమున నొండొంటితో
నొరసి యుయ్యేల లూగు తరగ లనఁగ
శృంగార దివిఁ విచిత్రభాషపుఁ బల్ల
టీలువైచెడు పావురా లనంగ
నిత్యసంతోష చంద్రికను స్వేచ్ఛావిహా
రం బొనర్చెడు చకోరము లనంగ

తే. గీ. ఒకరొకరిచేత వికసనమఁ బొంది యొక్క
రొకరియందున లీనమై యొక్కరొకరి
కున్నతిం గూర్చి ద్యోతిల్లి యొక్క వింత
యంద మిచ్చిరి వార లానందమునకు.

తే. గీ. నింగి బంగరుచాయపైఁ జెంగలించు
చిటిపొటి మొయిళ్ళ చిత్రవిచిత్రరూప
సంఘటనలెల్ల నాశ్చర్యచకిత దృష్టి
నవధరింతుడు వాఁడు సంధ్యాగమముల.

తే. గీ అవుడపుడు వాయు శాఖిశాఖాంతరాళ
నిర్గత స్వీయ శయన మందిర గవాక్ష
సన్నిహితచంద్రకిరణ గుచ్ఛముల దెరలు
మిసమిసలఁ గ్రోలుచుందురు రసపిపాస.

చ. పొదిపిళులాడుచున్ గపురముఁబలె మేల్ తెలుపుం బునుంగుకై
వడినెఱతావియుంగలిగి పట్టువలెన్ మృదువై ఘృతంబుతో
నుడికినటుల్ నిగన్నిగల నొప్పుచు నప్పుడు పిండు పాలఁబో
లెడి నులివెచ్చనన్ బరిఢవిల్లెడు కుంకుమపూ రసాన్నమున్.

చ. చిఱునవుతోడ మేలినగిషీగల బంగరుపూల వెండిప
ళ్లెరమున నించి సుంతగడలింప ఘుమంఘుమయందు జిహ్వపై
గరఁగెడు శాకముల్ రకరకంబులు చుట్టు నమర్చి చేరపై
పొరలెడి యాజ్యధారఁ దనివోవఁగ వడ్డనచేయు నిచ్చలున్.

చ. అడుగుల నొత్తుచున్ దములపాకుల చారికలేనియుం గనం
బడు గళమెత్తి సన్నని రవంబునఁ జల్లగ పాటపాడి నె
య్యురఁడు సుఖనిద్రఁజెందనొకయోరగ శయ్యబరుండి యామెరే
గడవఁగమేల్కొనున్మగనికన్న సుమున్ దెలవారుజామునన్.

ఉ. ఏయమగర్భమందు జనియించెనొ యామె, కృపారసంబుచే
నాయమ చిత్తమెంత మృదువైనదియో, పువుదోటలోనికిం
బోయియు నంతటం గలయఁజూచిన తీవల వంచియున్ బువుల్
గోయఁగఁజేయిరాక మరలున్ మునువచ్చినత్రోవ నొక్కెడన్.

సీ. వరుఁ డింకొకనివంటివాఁడొకో ! మనసిచ్చి
మాటాడు మన్మథ మన్మథుండు
ఆఁడుబిడ్డల నెంతయని మెచ్చుకొనవచ్చు
తాను గీచినగీటు దాటఁబోరు
ఉదిగంబువారలే యుగమువారో గాని
కొలువ నెప్పుడు గాచుకొనియె యుందు
రనువత్సరంబు మాన్యక్షేత్రములయందు
బండు పంట తెలుంగు పాలపొంగు

తే. గీ తావులకుఁ దావలంబైన పూవుతోట
నసుమ నొక దివ్యభవనంబు నన్నివాస
మారగింపగ వెంగిలంగారుపాత్ర
లేమనఁగవచ్చు నామె యదృష్టరేఖ.

చ. ఇరువురుగూడి వేదిక మెయిన్ మతసాంఘిక రాజకీయ సం
స్కరణ గుణాగుణాచరణ సాధనరూప విచారణా పర
స్పర విజయాభిలాష నతిచాకచకిన్ మృదువాక్ప్రయోగముల్
నెఱపుదు రెల్లవారు విని నివ్వెఱవోవ నొకొక్క పట్టునన్.

చ. నవయుగ భారత ప్రచలనంబు లనంతములైన విశ్వమా
నవ పరిణామ లీలలు సనాతన వైదిక ధర్మ వృత్త్యుప
ద్రవకర దాస్యజీవన పరస్పరవైర విఘూర్ణమాన హైం
దవ దురదృష్ట రేఖికలుఁ దత్కృత చర్చలకున్ బ్రధానముల్.

ఉ. వర్ణవిభేదదోష పరివర్జిత దివ్యతపః ప్రభావ సం
పూర్ణ పురాతనార్య ఋషిపుంగవ పుణ్యవనాంతరస్థలీ
పర్ణకుటీరవాస నిరుపద్రవ నిర్మల నిత్యజీవన
స్వర్ణయుగ ప్రసంగములు సల్పుదు రొక్కెడగూడి యిర్వురున్.



'శారద' నుండి

## సముద్ర వర్ణనము

మ. అరుణుం దేగెను-కాలపూరుషునిచే నాకాశవీధీ మనో
హరదుర్గాపరదిక్సువర్ణమయ సింహద్వార మామీఁదటన్
తెలుపంగాఁ బడుచుండె-నింక వెడలున్ రేరాణి భూలోక సం
చరణార్థంబని మ్రోగె నెల్లెడ నుదంచత్పక్షితూర్య ధ్వనుల్.

మ. అలకల్ దిద్దుచు, రత్నకంబళిముచాయం బొల్చు శేఁబచ్చికం
గలయం జూచుచుఁ బూలతీగియలపైగా సారె కేతెంచుచున్,
మెలమెల్లన్ మెయిఁ బ్రాకుచున్. నవనవోన్మేషంబుపాటించుచున్
వలపింపన్ బసిపైరగాలి వనిలో వాహ్యాళి గావించుచున్.

మ. ఇరువంకంగల పూలపై ముసురుచున్, హేలాగతిన్ వానిపై
పొరపుష్పాశాకచోటినుండి యొకచోఁ బొందించుచున్, బుష్పతే
పరదాంపత్య సుఖానుభూతి ఘటనాసంసక్తమై తేనెయో
గిరముఁ బారణసేయు భృంగపటలీగీతంబు లాలింపుచున్.

మ. అటులిట్టుల్ విహరించి, కొంతవరికా యారామకేళీసర
స్తటి నానాఫలవృక్ష సంతతుల చెంతంజేరి, తత్కాల సం
ఘటితాకాశ వినీలమేఘములవంకన్ దృష్టి సారించునం
తటిలో శారదమ్రోల నిల్చె నొక నూత్నవ్యక్తి నిశ్శంకతన్.

మ. ఎపు డిచ్చోటికి నేగుదెంచితి, రవీ! యీవత్సరంబైనఁ బ
ట్టపరీక్షన్ జయమొందు జాడ పొడగట్టం జొచ్చెనే? చెన్నప
ట్టపువాసంబు సుఖప్రదం బగునె? యిష్టాగోష్ఠి నచ్చో సము
ద్రపుఁదీరంబున మిత్రులం గలిసి సంధ్యాకాలముం బుత్తువే?

మ. అని ప్రశ్నింపఁగ నాతఁ డీదినము మధ్యాహ్నంబునన్ జేరినాఁ
డను పట్టంబున నుండి యీ విజయవాడన్ శారదా! శక్తిపం
ఒనరేకుండ లిఖించినాడను పరీక్షాపత్ర మట్లయ్యు వా
కొనరా దేఫలితంబు వెల్వడెడి నాకా! కాలగర్భంబునన్.

మ. అపశిష్టంబగు 'చెన్నపట్టణ' నివాసానందముం గూర్చి యెం
త వచింపంగఁ గడంగినన్ దనివిఁ జెందం బోదుమే! అందు నే
దొ విశేషంబు నిమేషమున్ నడచుచుండన్ ద్రవ్యమున్ పేరివ
స్తువా కంటుండినహాయిమైఁ గడుపవచ్చున్ జీవితంబంతయున్.

శా. సాయంకాల సముద్రతీరకృత సంచారంబునం గల్గు స్వ
ర్గీయానందము చూఱగొంచు నపరాద్రిద్యోతమానారుణ
చ్ఛాయాకల్పిత చిత్రవర్ణయుత శశ్వన్నృత్య దూర్మిచ్ఛటా
గేయాకర్ణన భాగ్యముం గనని వ్యక్తిం జూడఁ బో మప్పురిన్.

శా. ఆయా పున్నమరేల నేను సహపాఠ్యాయుండనై పోయి యా
తాయాతాబ్ధితరంగ పంక్త్యుపరి భాగా పూర్ణచంద్రా తప
చ్ఛాయా సుందర సుప్రసన్న మధుర స్వచ్ఛందలీలా విహా
రాయత్తంబగు దృష్టి నుందును నిశీథాంతంబు పర్యంతమున్.

శా. ఏందుం బున్నమపండువెన్నెలను వెండిన్ గీర్చినట్లుండి యెం
దాండుం దాకు తరంగడోలికలలో నుయ్యాల లూగంగ జం
ద్రుం దద్దిం బ్రతిబింబరూపమున నెంతో నేత్రపర్వంబుగా
నుండుం గన్నుల నాడుచున్నయటులేయుండున్ మదిం బాటినన్.

మ. త్వరితాన్యోన్యతరంగ ఘట్టనలచేతన్ మాటికవ్యానిప్తై
నురుగుల్ దేఱి కరుళ్ళుగట్టి కను విందుం గూర్చు నచ్చోటి సా
గరనీరంబున మిన్కుమిన్కు మను రాకాచంద్రచంద్రాతప
స్ఫురణంబున్ దలపించినన్ బులకరించున్ దేహ మత్యంతమున్.



## 'సతీస్మృతి' నుండి

శా. నాఁడే కారు భవద్వియోగ మిపుడైనన్ దృష్టికిం బాఱినన్
నాడీమండలమెల్ల లగ్నమని మందంబౌచుఁ బ్రాణంబు ల
ల్లాడన్ సాఁగుఁ గుణాంధకారఁ బలవ్రయ్యల్ వేసినట్లుండు నీ
రేయున్ లోకము లస్తమించిన విధంబే తోఁచుఁ జిత్తంబునన్.

మ. సతియన్ దివ్యసుపర్ణపక్షముల నీస్థానంబు గుర్తింప నా
యత్తమై నాదు మనోవిహంగ మిదె యీయాకాశవీథీ సము
ద్గతమయ్యెన్ దురదృష్టవాతహతి భంగం బందునో, లేక సం
తత చింతాపరిపాకశక్తిఁ గృతకృత్యంబౌనొ, ప్రాణేశ్వరీ!

మ. నను వంచించెనుగాని పాడు నరజన్మం బిచ్చి దైవంబు మిం
టను బాఱంగలయట్టి పిట్టనయియున్నన్ నా బహిఃప్రాణముం
దిన లోకంబున కత్తె నే నెగిరిపోనే యెన్నఁడో! యింక లా
జిన యీవ్యర్థపు జీవనంబును నెడారిన్ యాత్ర సాగింతునే.

మ. జడమై నిర్వికృతిన్ వహించు నొక పాషాణంబునై యున్నచో
నడలం బోదునె నేసతీ మరణదుర్ఘాతపాత వ్యథన్
బడి యీరీతి దినక్రమప్రశమితస్నానాన్నపానుండనై
కడ కష్టపు దివానిశాయుగ విభాగజ్ఞాన శూన్యుండనై.

శా. ఇన్నాళ్ళుండెడి మనం బొనొక్కెడెడ నెట్లుద్వేగ బోవుచుండు నీ
సౌన్దర్యంబున కేను పెంచుటకునై స్వర్గంబునందైన నీ
వున్నావో మఱిలేవో యంచు నటులై నుయ్యాలలా గూగు ని
ర్విణ్ణంబౌ నొకవేళ నొక్కపుడు నిర్వేదంబుఁ జెందున్ సఖీ।

మ. మెఱపైకెత్తి యొకానొకప్పుడు శరన్మేఘంబులం గాంచి నీ
పొడ నేమే నెఱిగించునేమొయని నే బుద్ధీంద్రియ క్షోభతో
నడుగన్ జూచెద మెన్నొ చుక్కల ననంతాకాశమందైన నె
క్కడ నీ చక్కని చుక్కఁ గానమను సంజ్ఞన్ దెల్లవోవున్ సఖీ।

మ. కలకాలం బిట నుట్టిగట్టుకొని యూగం బోవుగా, నేటికిన్
నలకల్ మూడగు పట్టుచుండెగద, ప్రాణం బింక నీకళ్యమున్
గలగాఁ జల్లఁగ దాటిపోవగల భాగ్యం బెప్పుడో యంచు నీ
వలనాఁ దూరక యన్న యప్పలుకె సత్యంబయ్యె నాత్మేశ్వరీ!

మ. తెలుపంబోలని యూహ్యదంతర దహత్తీవ్రాగ్నిహోత్రంబు శాం
తిలఁజేయం దిరమంత్ర మిప్పుడు చితాగ్నిజ్వాలయే కాని వం
తలుసుం జింతలు సుంత కాపనుట తథ్యం బిష్టముష్టేన శ్రీ
దలమున్ వాక్యగతార్థ మిప్పటికి బోధంబయ్యె నాత్మేశ్వరీ.

మ. నిరుడేఁ గన్నులఁ జూచుచుండఁగ, జితాగ్నిజ్వాలికా మాలికాం
తరతప్తం బొనరించి నీతను సువర్ణంబందుఁ జెన్నొందు సుం
దరతేజంబు హరించి పైవము, శ్మశాన క్షోణిలో నిల్పె నా
కొఱకై బూది, హరించె వాయుపతియున్ గోరంత లేకుండగన్.

సీ. జ్వరితవై యున్న నీచాయనే భూదేవి
యను ఎండవేడిమి నుడికిపోయె
అగ్నికీలలలోని యూనివడెనె సర్వ
శేషమయ్యెను దిన శ్రీపఘాటి
మండు మంట లడంగు పండు నిప్పటు సంజ
గగన శ్మశాన భాగమునఁ గ్రాలె
నిప్పుపై పైగప్పు నివురునాఁ దెలిమబ్బు
పలుచపై సంజపై పైనఁ గవిసె

తే. గీ. ప్రియసఖి ! మన ప్రేమ జీవితమువలెనె
ముడివడియె మూడు సందెలు, మునిగిపోయె
నంధకారతమాల లోకాంతరమున
నఖిలలోకము, నే శోకమందువలెనె.

తే, గీ. ఎఱుఁగని మనోవ్యథయె కాని యెంతొ కాల
మటుల జ్యోతిః ప్రభలతోడ నక్షిగోళ
మేఘములఁ జూపు మెఱపులు మెఱయుమీఁద
మరణ నిర్ఘాతపాతంబు జరుగకున్నె.

సీ ఆధిక ప్రయాన జిహ్వానీత మందిమం
దాంత్యకాల నివేదనాక్షరములు
పరివేదనా ముహూర్భవ భాష్పధారావి
లోలసాకూతావలోకనములు

జ్వరతీవ్ర తీవ్రతాత్వరమాణ హృద్యంత్ర
చరమనాడీ హఠాత్ స్తంభనములు
ఇహ నిరాశా నిస్పృహైర సూచక ముఖ
చంద్రాస్తమయ తిరశ్చాలనములు

తే. గీ. విషమఘటనా విభిన్న విభిన్నమైన
నా హృదయదర్పణమున ననంతములుగఁ
బ్రతిఫలించుచు నొనరించు ప్రళయతాండ
వార్భటి భయంకరాతి భయంకరంబు.

మ. అతిశీఘ్రంబుగ నస్తమించె నొక సంధ్యాకాలపుం జుక్కకుం
బ్రతియై కన్నులపండువైన మన దాంపత్యంబు, కానీ భవ
త్స్మృతినన్ పైపొరయెల్ల నూడిపడిపోవంజేసి నీయట్లు భి
న్నతవేకుంతు ననంతమం దెపుడు లీనంబౌదు నాత్మేశ్వరీ!

మ. కరుపుఁ దీపియు గాఢమైన యనురాగం బేకమై మాటికిన్
విడు ప్రత్యక్షుకణంబునందుఁ బ్రతిబింబింపంగ సంతానము
న్నెడకున్ నాయెడ కక్షిగోళముల నీవిట్టట్టులం ద్రిప్పి చూ
చెడు నీయా కడసారి చూపె నసుమంచెన్ నేటిపర్యంతమున్.

మ. మరణానంతరమందు నింక నొక జన్మంబెత్తితో! మాపయిన్
మఱి నీకుంగల ప్రేమపుం బెఱపెఱన్ మామధ్యనే యెప్పుడుఁ
దిరుగఁజొచ్చితొ! లేక యామొదలితోనే నీవునుం దీఱితో!
పరలోకంబును జేరితో! తెలియ త్రోవం జూపు మాత్మేశ్వరీ!

మ. మురిపెంపుం బసిబిడ్డలన్ విడిచి, నీమూలంబునన్ సాగు కా
పుర మధ్వాన మొనర్చి, యాదినమునన్ బోలేక పోలేక తి
వరమౌ వేదననుండియున్ గనులతో భాషించి యేకోర్కి నా
కెఱుఁగంజేసితి దానిఁబేమఱతునే యేనాటి కాత్మేశ్వరీ!

తే. గీ. తత్తదుచితంబులైన వస్త్రసలవలన
బాల్యముననుండి పెనుపంగఁబడిన యొడలె
నాకు నీ కిప్పు డడ్డమై నడుమ నిలిచె
నింతకన్నఁ గృతఘ్నత్వ మెందుఁ గలదొ!

శా ఆకాలంబు గతించె, నాసుఖ మదృశ్యంబయ్యె, నాప్రేమపుం
జోకల్ పోకలు దృగ్విలాస నటనల్ శూలాయమానంబులై
తాకన్ వొచ్చె. క్షణక్షణంబు హృదయాంతర్నాళజీవాణు లె
ట్లా కంపించుచు నున్నవో యెఱుగవా, హా నా మనోవల్లభా!

శా. శోకాఘూత విపర్యయస్థితిని సంశూన్యంబుగాఁ దోచు నీ
లోకంబందున నేమి ప్రామికొన నాలోచించెనోగాని ఛా
యాకారంబుగ వచ్చి మృత్యువు సమాహ్వానంబుఁ గావింప న
స్తోకం బెట్టిదొ చంగె నష్టగతకాయంబెంత హేయం బొకో!

కుడిచనుబాలఁ ద్రావు పసికూనను వాని యనుంగుఁదల్లి తా
నెదమరుఁ ద్రిప్పి చన్గుడువనిచ్చెడు నంతటిలోన బిడ్డ యె
వ్వడువునఁ బోరుపెట్టుఁ బ్రతిప్రాణియునట్టులె యీప్రపంచమున్
విడి పరమేగునా నడుమ వేసపాలగుఁగాదె, ప్రేయసీ!

మ. నది నౌకాగమనంబుచేఁ గలుగు నానారూపపుం జీలికల్
పిసపన్ గల్పిన యానవాలయినఁ గన్పింపంగఁబోనీని పా
ఱుదలంబోలె సమష్టితోఁ బొడము వేఱుంబాటులన్ దిద్దియొ
క్కదశన్ సంస్కృతి నిర్వహించితివి లోకం బెన్న నాత్మేశ్వరీ!

తే. గీ. ఆతుకొను నీడన విహార మాడినాము
కొమరుఁ బ్రాయంబునం గవగూడినాము
ఐహికానందమును చూఱలాడినాము
విధివశంబున నేఁడు వీడినాము.

తే. గీ. సరళముఁ బ్రశాంతమును సుప్రసాద మధుర
తరమైన నాటి జీవితా చరణమెల్లఁ
బరమ నిస్పృహచేఁ బటాపంచలయ్యె
క్షార సమ్మిశ్రితంబైన క్షీరమట్లు.

తే. గీ. కపవనో! లేక చక్రవాకమునా! గాక
కటకటా! మానవుఁడనైన కారణమునఁ
బవలులన్ రేలు నే నొక్క పగిదిగాఁగఁ
గ్రాగవలసెను నీ వియోగ వ్యథాగ్ని.

తే. గీ. పదపద వినిస్రుతంబగు ప్రాణధార
దినదినము నాకు నవనవోత్తేజ మొసఁగఁ
బలుకరించెడు నా ప్రాణపదము లేని
పాడులోకాన నేనేల బ్రదుకవలయు.

తే. గీ. అరుగుట యనంగ నుఱుపుటయనఁ జిరాకు,
అడుగడుగునందు బ్రహ్మాండమగుఁ బరాకు.
నాకు దుష్ప్రాపకంబగు లోకమునకు
నేమి సంబంధమో! ఉంటు టెందుకోరిహో!

చ. అది మన మారహస్యనిలయంబుననుండి పరస్పరంబుగా
హృదయము లంకితంబు లొనరించిన పుణ్యదినమ్ము, నాటి నీ
మృదుతర ముగ్ధమోహన శరీరముఁ, జల్లని సీగులాబిపూఁ
బెదవులమీఁది తేనెగవు వెన్నెల వన్నెలతోచు నెన్గెడలన్.

చ. ఎదురుగనుండి యొక్కయెడ నిర్వరమున్ బెదవుల్ చలింపకే
మదిమది మాటలాడ మన మధ్యనెమధ్యనె చూపుచూపుసం
బదిలపడంగ నాదు గరుపంబడియుండిన పుణ్యకాలమే
మెదలెడి కన్నులందెపుడు మేల్కొనినన్ నిదురించుచుండినన్.

చ. మెలినిదుకొన్న పాదముల మెత్తదనమున్ సగమొత్తిగిల్లి చె
క్కిలి యరచేతమోపి కనుగీటుననే కడు నీటు జూపి న
వ్వ్యాలయఁగఁజేసిన న్వలచియున్ వలపించినయట్టి నాటి యా
పొలకువవాటెసంతన చివుక్కుమనున్ హృదయంబు సర్వమున్.

మ. ఒరియందుంచినయట్టి మల్లెపువులం బొక్కొక్కటిన్ దీసి వా
ల్జడ యల్లించుకొనంగఁ బల్లకిడు వేళన్ వచ్చి నన్ గాంచి వె
ల్వడగా నిల్వఁగ బాలవోక ముసిగాళ్ళన్ నిల్చునా నాటి నీ
పడుపుఁ బ్రాయపుఁ జిన్నె నాకనులకున్ బ్రత్యక్షమౌ గావుతన్.

వ. మనసులు మాటలుం గ్రియలు మర్మములేక ముఖంబుగాగ వె
చ్చని నునుకోరికల్ విసవిసన్ మసలన్ మును చూఱగొన్న తీ
యని సుఖపారణంబు హృదయ ప్రతిబింబితమయ్యె దర్పణం
బునఁ ప్రతిబింబితంబయిన మోహన దివ్యధనంబు చాడ్పునన్.

తే. గీ. సహజకోమలమైన పుష్పంబెగాక
కఠినశిలయేసి యందమై క్రాలునట్లు
హాసమేగాక నీ యాగ్రహంబు సైత
మమృతధారాభిషేచనం బాచరించె.

తే గీ. ఎవనెదం గదియించుచు నిమిడి యిమిడి
యొకరి కౌగింట నొకర మట్లున్న నాటి
ప్రణయబంధంబు నాకు నిప్పటికే కాదు
మఱపునకు రాదు వేయి జన్మములకైన.

తే గీ. ఒకట నేకాంతమున నుండి యొకరి నొకర
మతిమృదులమైన పరిహాస మాడుకొనుచు
లోతెఱుంగని నవ్వులలోన మునిగి
తేలుటానాటితోడనే తీఱిపోయె.

సీ. ఉదయంబునుండి యొక్కొక్క మహాయుగముగా
గడియయుగంబె తిరుగంబడంగ
మధ్యాహ్నమై సూర్యమండలం బటు వ్రాలఁ
బోవుచో హృదయ ముప్పొంగిపోవ

ఒక్కపుష్పము నభోవీధిగా నీ సఖ్య
మునకై నాప్రాణ మున్ముఖముగాగ
ఎల్ల రక్తప్రవాహికలు నీ క్రేవకే
నను( గొనిపోవుతేవను వహింప

తే గీ. పవలు పవలెల్ల( బ్రణయ విశ్వాస భరము
దైన నిశ్వాసములతోడ నల్లనాఁడు
సలిపియుండిన యానానిశానిరీక్ష
ఇపుడు నా ప్రేమ కగ్నిపరీక్ష యయ్యె.

తే. గీ కెలనికిం జేరి కేలికిం గేలు సేర్చి
సృష్టి గూరిచి నీ వానరించునాటి
సరసచర్చాపటీరచర్చామచర్చి
ఆత్మకు దహద్దహద్దనార్చి యయ్యె.

సీ. ఒకటి రెండుగ మాత్ర ముండి మోమున నాతి
యాఱని చినుకు ముత్యాలతోడ
నొకకొన్ని చిఱుతగాలికి రేగ( దడినంటు
కొను కొన్ని చిన్ని ముంగురులతోడ(
దడిపొడి పారిజాతపువన్నె రైకపై
పన్నీటి పువువన్నె పైటతోడ
అడుగు దమ్ములమీది కఱజాఱు చీరకు
చ్చెళ్లు దిద్దెడి చివుర్ వ్రేళ్ళతోడ

తే. గీ. వడివడిగ నాఁడు దొలకరివానలోనఁ
బరుగిడుచు నింటిలో జొరంబడినయట్టి
నీ మధురరూపరేఖ కన్పించినట్లై
తలఁచి మది యిప్పు డూరక తత్తరించు.

సీ. సన్నజాజుల సువాసనతోడి చినుకు ము
త్యాల తొల్కరి మొల్కగాలికన్నఁ
ఒడిదుక్కనుండి వెల్వడు తావిఠీవితోఁ
దేలియాడెడి పైరగాలికన్న
గోపజవ్వాది ఘుగ్గుఘుగ్గులతోడఁ
గలిసిపోయిన వలిగాలికన్నఁ
బచ్చగోరంటఁ పుష్పపరిమళంబుతో
జతగొన్న మలయమారుతముకన్న

తే. గీ. మధుర మధురంబు, మంజుల మంజులంబు,
ముగ్ధముగ్ధంబు, మోహన మోహనంబు,
నీ సురభిళాతిమృదుల నిశ్వాస పవన
మకట ఛ్చాయామయ స్వప్నమయ్యె నేఁడు.

సీ. వెనుకకుం జనుచు నొడ్డున సముద్రంబు ని
ర్మించుచుండెడునట్టి మెట్లమాడ్కి
విసరి గాలిదుమార మిసుకతిన్నియలయం
దున సమర్చుచు నుండు నొక్కులట్టు

లోకవిధంబుగ మీను నొదలిపై మిలమిలన్
మెఱసిపోయెడునట్టి పొరల కరణి
నపుడప్పు డాకసంబందుఁ దోచు నలంతి
యలఁతి మబ్బులలోని యఱుం పోల్కిఁ

తే. గీ. గనులు రెండైనఁ జూపు నొక్కటిగఁ జేసె
హృదయముఁ గఱంచుచుండు నీ యుదరకణుల
నంట నుంకింప నీ వింతసంత నొదుగు
దృశ్యమునకును నాకును దీతె బుణము.

సీ. కనుఁ జిన్నిమబ్బు లొక్కొటియు నొక్కటి గూడి
యపుడప్పుడే యవలవలఁ జనుట
సంజయందలి యపరంజి చాయలు వోయి
కటికచీకటి దెసల్ గ్రమ్ముకొనుట
మినుకుమినుక్కను నెపంబున మింటి తారకల్
ననుఁ జూచి ముసిముసినవ్వు నవుట
అల్లనల్లనఁ బ్రభాతాయాత వాయువుల్
చెవిచెంత గుజగుజల్ సేయుచుంట

తే. గీ. కనుగొను కొలంది మన వియోగంబె గాక,
నా ప్రకృత జీవితమును లోకప్రకృతియు
నా సహోదర మిత్రానునయములెల్ల
నుల్లమునఁ దట్టు నమ్చనం దొత్తినట్లు!

తే. గీ. చితిపయిం బెట్టి నిన్ను భస్మీకరించు
ఘోరదృశ్యంబు నా జీవకోశమంటె
జీవితేశ్వరి ! యిఁక నెంత శీఘ్రగతిని
చేరవత్తునొ నీవె వీక్షింతుగాత !



'రామాయణము' నుండి

సీ. అది చిన్ని చిన్ని ముత్యాలు ముత్యాలుగా
నెలయేటిలో నీరు చిలుకు చోటు
ఆ చిన్ని నీటిముత్యము ముత్యమును ముద్దు
లొలుకునాసమయ మర్కోదయంబు
ఆ స్వర్ణ సూర్యోదయంబు పర్వత పర్వ
తాంతరాంతర భూరుహాంచలముల
నా యంచలములపై నాడు నాయారుణ్య
మహహా! యెంతటి హృదయంగమంబు!

తే. గీ. ఆయకృత్రిమ రామణీయకవినూత్న
రత్నకాంతి ప్రవాహ నీరాజనమున
రాజిలుచునున్న యతఁడె శ్రీరామమూర్తి
జలధర శ్యామసుందర చక్రవర్తి!

సీ. ఆ విశ్వమోహనం బగు పరబ్రహ్మంబె
జానకీ హృదయపంజర శుకంబు
ఆ పరంజ్యోతియే యల్లరాఘవ పర
బ్రహ్మజీవన సుప్రభాతగీతి
పతి రాఘవుం డెట్లు ప్రత్యక్షమైనట్టి
జనకుని పూర్వపూజాఫలంబొ
సతి జానకియు నట్లె జనకరాజ మహర్షి
శాంతిభూమీ శుభచ్ఛాయ యయ్యెఁ

తే. గీ. పురుషులం దట్టి శ్యామసుందరునిఁ గాని
స్త్రీలయం దట్టి సౌందర్యతిలకఁ గాని
పతిసతుల సట్టి పుణ్యదంపతులఁ గాని
కనివిని యెఱుంగ మెందు నేకాలమందు.

సీ. మాణిక్యముగ విశ్వమాతృగర్భమునుండి
యావిర్భవిలిన ప్రత్యక్ష లక్ష్మి
చందనాంకురముగా జనకరాజ మహర్షి
సాకికొన్నట్టి కన్యాకుమారి
జాజితీవగ రామచంద్ర మందారంబు
నాశ్రయించిన తదాయత్తచిత్త
తోడునీడగ భర్తతో ఘోరకాంతార
మనుగమించిన ప్రణయ ప్రపూర్ణ

తే. గీ. ధరణి జనయిత్రి తరుసహోదరు లౌసంగు
జేగురుం గుంకుమము నారచీర దాల్చి
చూచితే ! సీత చక్కని చుక్క లీల
నెటుల నిల్చెనో తన జీవితేశు మ్రోల !

సీ వరసినంతగఁ బ్రాణవాయు వాఘ్రాణింపఁ
బారణం బొనరింపఁ ఫలరసంబు
తీర్థమాడంగ నదీప్రవాహ జలంబు
వస్త్రంబుగ ధరింప వల్కలంబు

జపతపంబుల దీర్చ సాంద్రవృక్షచ్ఛాయ
అట నధిష్ఠింపఁ గృష్ణాజినంబు
ఆనంద మొంద నాత్మాను సంధానంబు
విశ్రమింప స్వయంకృతాశ్రమంబు

తే గీ. పవ్వళింపంగఁ బచ్చిక ప్రంపుటనఁటి
యాకుఁ బాకను లేఁజివురాకుఁ బాన్పు
కలదె ! లక్ష్మణా ! స్వర్గలోకమున నైనఁ
బావనం బీమహారణ్య జీవనంబు.

సీ. పఱచిన రత్నకంబళముల ట్లలరారు
నెలయేటిగట్ల పచ్చికబయళ్ళ
గోగణంబుల మేపుకొనుచు నాలాపించు
విప్రబాలుర సాపువేదగీతి
ప్రతి ఋషీశ్వర కుటీరంబు వెల్వడివచ్చు
వైశ్వదేవ సుగంధవాయులహరి
ఫలభారమూని చూపఱకు నమ్రత్వంబు
బోధింప వ్రాలిన భూరుహములు

తే. గీ. ఆశ్రమ మహీరుహంబుల కవలియవలి
యపర సంధ్యా సువర్ణ సూర్యాస్తమయము
నా మహాముహా మందమందానిలముల
హాయి యలవడు టెంత పుణ్యమున వత్స !

సీ. ఫలవృక్షముల మధ్యభాగమం దొక్కొక్క
యతికి నొక్కొక్క పుణ్యాశ్రమంబు
ఆశ్రమాశ్రమమునం దఖిల విద్యాబోధ
కారకునై యొక్కొక్క గురుకులంబు
గురుకులంబులఁ జుట్టుకొని యున్న కుంద నీ
వారంబు పండు కేదారకములు
కేదారకములలోఁ గ్రింద రాలినయట్టి
కొలుచు భక్షించు శకుంతకోటి

తే. గీ. ప్రతి శకుంతము సాయం ప్రభాతములను
దినదినముఁ బాడుతీయని తేనెగీతి
గీతిగీతియు శబ్దించు గిరులదరుల
రమ్యగంభీర మిమ్మహారణ్యభూమి.



## ఒకకన్య

చ. చెదరిడు సిగ్గుచిన్నె యొక చిన్నమునున్, నునుమేను పూచి పూ
యుడు తొలిజవ్వనంపుఁ బదియారవవన్నె పసిండిపూఁత, ని
ల్వదు చివురాకు మోవి సవిలాసముగా దరహాసలక్ష్మి, నిం
డదు మటినింకి యింకఁ బదునార్గవ వత్సరమేని లీలకున్.

చ. పొడముచునంతలో నడఁగిపోవును పొంగయుఁ బొంగకుండు తే
యెడదను దొరకోరిక లనేకము చెప్పటికప్పు డిప్పు డి
ప్పుడె యుదయంబునుండి పడిపోవుచుఁ బోవుచునుండు మంచుకై
వడి మనలీల బాల్యమెడబాయుచుఁ బాయుచునుండె దేహమున్.

ఉ. పాలపతెన్ ప్రవర్తిరెడి బాల్యము వెచ్చని కోర్కెఁ జేసి కా
బోలును పొంగి తోడుకొనఁ బోవుచునున్నది నేఁడు శీలపుం
జాలను తక్రధార నిఁక జల్లగఁ దేటెడు జవ్వనంపు మే
ల్మేలి నిగారపుం దళుకమీగమ యెవ్వనికిన్ లభించునో ।



[illegible]

సీ. రాకేందులోని పన్నీరు పుష్పములకన్న
దివ్యమైన శరీరదీప్తి నొసఁగి
పండువెన్నెలలోని ప్రసవాసముకన్నఁ
జల్లనైన మనః ప్రచార మొసఁగి
వియదభ్రములలోని విద్యుల్లతలకన్న
సొబగైన చిఱుత వాల్చూపు లొసఁగి
మాలతీవనిలోని మలయానిలముకన్న
వాసించునంత పేర్వాసి యొసఁగి

తే. గీ. చిరతరాయుష్య మొసఁగి ప్రాచీన హైంద
వార్య ఋషికుల సంప్రదాయానుకూల
జీవనసుఖం బొసంగి సుశ్రీ యొసంగి
బాలు రక్షించుగావుత ప్రకృతిమాత.

సీ. మహిత సాధ్వీమణీ మాణిక్య దర్పణ
స్వచ్ఛమానసవృత్తి స్తన్యమిచ్చి
విశ్వవిశ్వంభరా వీరవీరాంగనా
నిర్నిద్ర చరితల నిద్రబుచ్చి
భరత ధాత్రీశ్వరీ పరమమంగళగీతి
కాళీరవంబుచే మేలుకొలిపి
ప్రాక్తనార్షమతప్రవృత్తనామోచ్చార
ణంబుచే నుచ్చారణంబు గఱపి

తే. గీ. సహజమగు ప్రేమ నమృతహస్తములచేతఁ
బెనుచుకొనుఁ డింక మాధవపెద్దివంశ
మౌక్తికంబైన మీ యీ కుమారుఁ బాలు
నన్నపూర్ణాహనూ మదాఘ్యకులార !

సీ. ఆకొన్నయపుడు నీ వారగించెడునట్టి
మాతృదుగ్ధముకన్న మధురమగుచు
కడుపు నిండినమీఁద గనులమీఁదికి వచ్చు
నిదురకన్నను జాల మృదులమగుచు
నిదుర మేల్కొనగ సందిటఁబట్టి యాడించు
జనని హస్తముకన్నఁ జలువయగుచు
ఆడించునప్పుడు నీ యలఁతి బుగ్గల నిల్చు
నెలనవ్వుకన్న నిష్కలుష మగుచు

తే. గీ. చిలుగుఁ జిలుగుం బలుకు నీదు చిన్నిమోవి
చిగురునందుండి వెలికి విచ్చేయు టింక
నెపుడెపుడొ యంచు బంధుల మెల్లవార
మెదురెదురు చూచుచుంటి మో యీ కుమార !



# క వి

ఉ. జీవులనెల్ల దేవుఁడె సృజించెనా నీవె సృజించియుంటివో
దేవునిఁ దద్రహస్య మెటు తేలదుగాని యిదేమి న్యాయమో
యీ ! వచియింపుచుంటివి కవీ ! పదునాలుగుగా జగంబు లె
ట్లీ వొకటుండవే యెఱిగి తెందుల కిట్టి యపూహకల్పనల్.

చ. ఇలఁగల యెల్ల మంచితనమే పరమేశ్వరుఁడన్న దానిచేఁ
గలుగు సుఖంబె స్వర్గ మదికానిదియే నరకంబు ప్రాణముల్
వెడలకపూర్వమే యనుభవించును వానిని జీవి భూమిలోఁ
గలిసిసమీఁద స్వర్గ నరకంబులు జీవి కెటుల్ ఘటిల్లెడున్.

ఉ. మేమును నీవు మానవులమే గద ! యొక్కఁడ నీవు మాత్రమే
భూమిని వీడి పై కెగిరిపోవవుగా ! యొకవేళఁ బోవ నీ
భూమికి రావుగా తిరిగి బూటకముల్ వచియించి యింత హం
గామ యొనర్ప నేమి యసిభూతము పైఁబడె నీకు నో కవీ !

మ. పరలోకంబున దైవ మున్నదను విశ్వాసంబుఁ బోఁదోలి యీ
నరుఁడే దైవమటంచుఁ దోడి నరులన్ నమ్మించి దైవంబునే
నరసంతాన మొనర్చినావు కడకున్ రామాయణంబందు నీ
చరితం బంతయునుం జిదంబర రహస్యంబాయె నోయీ కవీ !

శా. ఆదిన్ బింబమై నరప్రకృతిలో నామీఁద శబ్దార్థము
ర్యాదన్ వర్తిలి దన్నరప్రకృతినే దుంతన్ ద్వమేవాహమై
యాదైవంబు క్రమంబుగాఁ బ్రకృతి పాదాక్రాంతమైపోయె నీ
సౌందర్యంబగు మానవున్ బ్రకృతి రాజుం జేయు మోయీ కవీ!



## 'సంజయ రాయబారము' నుండి

### ధర్మరాజునకు ధృతరాష్ట్రుని సందేశము

మ. తనయున్ నాయెడ భక్తియుండు నొక యంధత్వంబునం బ్రాపించినా
జనుషాంధత్వమునే గణింపక కులాచారంబు శాస్త్రంబు నొ
ప్పని రాజ్యార్హత గట్టిపెట్టనది నైపన్ రానిదే యయ్యెఁ ద
ప్పనిపై పోయెను నాదు సోదరుని నిర్బంధంబె ముంచెన్ ననున్.

మ. వెనుకన్ ముందును చూడకుండ నొకటిన్ గావింపంగ వద్దంచు నె
త్తిని నోర్వెట్టుక చెప్పిచెప్పి విసువెత్తెన్ నాకుఁ దానేమొ మం
చిని కాలంబును చెప్పి సిక్కొనియెన్ చేసేతులం దెచ్చిపె
ట్టిన రాజ్యార్హత యన్నదే మొసరువెట్టెన్ గొంప కీనాటికిన్.

పిడికట్టానినె పట్టి యెల్లప్పుడు తా బ్రేలాడుచున్నాఁడు నా
కొడుకే సౌమ్యత చెప్పబెట్టినది [illegible] సంప్రదించెన్ నాసుఁదర
మ్మున్నతుఁడున్నై యుండిన పాండురాజెయిను మోమోటంబుచే నైన నే
సదిరాకుండఁ గాలంబు గావ మనదే సర్వంబు భారం బికన్.

ఎటులీ విచ్చితి నర్ధరాజ్యము మును నాదే కాదె రాజ్యం బెటో
యటు వేపుఱ్ఱ్యముచేసినో తిరిగి సంప్రాప్తించినన్ మాన వి
ప్పటికా మౌఢ్యము వాడిసూదిమొన మోపంబడ్డ మాత్రంబె యి
చ్చుటకే నొల్లనటంచు మాటి కెదిరించున్ బల్కు సిరీతిగన్.

మ. యువరాజై కొడుకుండ రాజనగ నేవో నామమాత్రంబె పౌ
రవ వంశీయుల యానుపూర్విక చరిత్రంబట్టి యేకాలమం
దెవరున్ రాజ్యము పాలు పంచుకొనినట్లే లేదు తత్వాలనా
వ్యవహారం బొక పెద్దవారల కుటుంబంబందె వర్తించెడిన్.

శా. నీ కాకీతినె సంక్రమించినది కానీ గ్రుడ్డి వీవాటచే
నీకున్ మారుగ రాజ్య మేలపలసెన్ నీతమ్ముఁ డౌనేటు నీ
దేకాదే? యధికార మంతియును నట్లే కానిచో నేను రా
జే కాకుండు నిఁకేల పాండవులకై యేభాగ మీయన్వలెన్.



## శ్రీ మునిమాణిక్యం నరసింహారావుగారి రచనలు

| | | | | |
|---|---|---|---|---|
| 1 | కాంతం కైఫీయతు | 1 | 0 | 0 |
| 2 | కాంతం కాపురం | 1 | 0 | 0 |
| 3 | కాంతం | 1 | 0 | 0 |
| 4 | నేనూ మాకాంతం | 1 | 0 | 0 |
| 5 | మునిమాణిక్యం నాటికలు | 1 | 0 | 0 |
| 6 | మునిమాణిక్యం కథలు | 1 | 0 | 0 |
| 7 | ఉపాధ్యాయుడు | 1 | 0 | 0 |
| 8 | తిరుమాళిగ | 1 | 0 | 0 |
| 9 | మేరీ కహానీ | 1 | 0 | 0 |
| 10 | దాంపత్య జీవితం | 1 | 0 | 0 |
| 11 | రేడియో నాటికలు | 1 | 0 | 0 |
| 12 | రాధబాబు | 1 | 0 | 0 |
| 13 | శరద్రాత్రులు | 1 | 0 | 0 |
| 14 | రుక్కుతల్లి | 1 | 0 | 0 |
| 15 | యదార్థ దృశ్యాలు | 1 | 0 | 0 |
| 16 | హాస్యకథలు | 1 | 0 | 0 |
| 17 | తల్లిప్రేమ | 1 | 0 | 0 |
| 18 | కథానికలు | 1 | 0 | 0 |
| 19 | దీక్షితులు | 1 | 0 | 0 |
| 20 | తగూ నెం. శ్రీ | 1 | 0 | 0 |
| 21 | వినోద వ్యాసములు | 1 | 0 | 0 |
| 22 | నా స్నేహితులు | 1 | 0 | 0 |

వలయువారు:—

**శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి**

## శ్రీ మాధవపెద్ది బుచ్చి సుందర రామశాస్త్రిగారి

| | | | | |
|---|---|---|---|---|
| 1 | ఉమర్ ఖయాం | 1 | 0 | 0 |
| 2 | బృందావనం | 1 | 0 | 0 |
| 3 | శబరి | 1 | 0 | 0 |
| 4 | పంచవటి | 1 | 0 | 0 |
| 5 | శృంగ్గార చాటువులు | 1 | 0 | 0 |
| 6 | మృత్యుంజయం | 1 | 0 | 0 |
| 7 | సుభాషితము | 1 | 0 | 0 |

## శ్రీ వేదాంతకవిగారి

| | | | | |
|---|---|---|---|---|
| 1 | తెరటాలు | 1 | 0 | 0 |
| 2 | కవితా సంస్థానం | 2 | 0 | 0 |
| 3 | అవ్వాయ్ చువ్వలు | 0 | 12 | 0 |
| 4 | దండయాత్ర | 1 | 0 | 0 |
| 5 | వరదలు | 1 | 0 | 0 |
| 6 | గడుగ్గాయి | 1 | 0 | 0 |
| 7 | చినరసాలు | 0 | 8 | 0 |
| 8 | భగవన్మతభాష్యం 1 వ భాగము | 1 | 4 | 0 |
| 9 | డిటో 2 వ భాగము | 1 | 0 | 0 |
| 10 | నాయుడుబావ | 1 | 0 | 0 |

## శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి

| | | | | |
|---|---|---|---|---|
| 1 | ఆంధ్రపౌరుషము | 0 | 6 | 0 |

వలయువారు:—

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి